ఒకప్పుడు ఆ పట్టణంలో ఎవ్వరికీ
ఉల్లిపాయ అంటే తెలియదు.



ఒక రోజు ఒక ప్రయాణికుడి సంచిలోంచి

ఒక ఉల్లిపాయ జారి పడిపోయింది.



ఆ కొత్త వస్తువుని చూసి ఆ ఊరి ప్రజలందరూ ఆశ్చర్యపోయారు.



అది ఒక కూరగాయని వాళ్లకి తెలిసింది.

అయితే, దాని గురించి మరింత తెలుసుకోవాలని వాళ్లకి ఉంది.





ఆ ఉల్లిపాయ దగ్గరకి వెళ్లిన మొదటి వ్యక్తికి అనుకోకుండా దగ్గు వచ్చింది.

అతడు అక్కడి నుంచి పరిగెత్తి ఉల్లిపాయ వల్ల దగ్గు వస్తుందని అందరికీ చెప్పాడు.



దాని దగ్గరకి వెళ్లిన రెండవ వ్యక్తికి
ఘాటు వాసన వచ్చింది.



“బయట నుంచే దీని వాసన ఇంత ఘాటుగా ఉంటే, కోస్తే దీని వాసనను అస్సలు తట్టుకోలేం,“ అతను అన్నాడు.





అందుకని అతడు ఆ ఉల్లిని అక్కే వదిలి వెళ్లిపోయాడు.

మూడవ వ్యక్తి ధైర్యం చేసి ఆ ఉల్లిపాయను కోశాడు.





ఉల్లి బయటి పొర అతడి

చేతిలోకి వచ్చింది.

"ఇది ఒక అద్భుతమైన వస్తువు," అక్కడ ఉన్న వాళ్లతో అతను చెప్పాడు.
"దీనిలోని మాయాగుణం వల్ల బయట పొరను తీసేసినా
దాని ఆకారం అలాగే ఉంటుంది!"



ఆ తరవాత ఒకామె దాని పొరలను వలిచింది.







దానితో వంట చేసింది.



దానితో చేసిన వంట ఆమెకి చాలా నచ్చింది!




ఆ వంటకం ఎంత రుచికరంగా ఉందంటే, ఆ వంట ఎలా చెయ్యాలో ఇతరులకు నేర్పించి ఆమె పేరు పొందింది.



"ఉల్లి రుచికరంగా ఉండటమే కాదు, ఈ అద్భుతమైన కూరగాయ ఎన్ని పొరలు తీసినా లోపల ఇంకొక పొర ఉంటూనే ఉంటుంది," వంటవాళ్లు దానిని పొగడసాగారు.

“పొర వలిచినప్పుడు అది చిన్నది అవుతుంది," ఒకరు అన్నారు.





“అది నీ భ్రమ," అంటూ వంటవాళ్లు,
పట్టణవాసులు ఆమెను కసురుకున్నారు.

ఎన్ని పొరలు తీసినా ఇంకా వస్తూనే ఉంటాయని నమ్మాలని వాళ్లకి ఉంది.



కానీ ఉల్లి ఆఖరి పొర తీసేసేసరికి....



“ఇది అద్భుతమైనదే కాదు మాయలమారిది కూడా,“
అందరూ ఒకేసారి అరిచారు.
ఉల్లి వాసన పోయేలా చేతులు కడుక్కుంటూ,
తుడుచుకుంటూ అందరూ ఏకాభిప్రాయానికి వచ్చారు...



...అదే సరైనది కూడా...



...ఉల్లి లేని పట్టణంలో ఉండటమే...



...ప్రజలకి మంచిది!

